## ఆంధ్ర యువతీమండలి మద్యపాన నిరోధము

(విలేఖరి)

మార్చి ౧౦వ తేదీనాడు మద్యపాన నిరోధక కేంద్రసంఘమువారి ఆదేశము ననుసరించి ఆంధ్రయువతీమండలి యాజమాన్యమున మలకపేట (అజంపురా)లో మద్యపాన నిరోధక దినము జరుపబడెను. దాదాపు మూడుమంది కొర్కి స్త్రీలూ పిల్లలూ సమావేశపరుపబడిరి. కేంద్రసంఘ ప్రచారణముయిన పాటలుపాడి వినిపింపబడెను. ఇల్లిందల సరస్వతీదేవిగారు, ముదుంబ మంగతాయారమ్మగారు, యెల్లాప్రగడ సీతాకుమారిగారు అనేక విధముల మద్యపానము వలని నష్టములను బోధించి, కనీసము స్త్రీలు త్రాగుట, పిల్లలకు త్రాగించుట, శుభాశుభకార్యములలో ఉపయోగించుట మానవలెనిదిగా చెప్పిరి. స్త్రీలు ఈవిషయములను శాంతముగావిని చెప్పినదంతా నిజమేనని అంగీకరించారు. కొంతమంది స్త్రీలు ఇకముందు తాము త్రాగకుండుటకును, పిల్లలకు త్రాపకుండుటకును దీక్ష తీసుకున్నారు. తరువాత వారందరూ బిస్కట్సు పంచిపెట్టబడి వెళ్లిపోయిరి.

హైదరాబాదు మార్చి ౪

నగరమండలిక్రింది స్థలములు పైనున్న చోట్లుగా ప్రకటింపబడినవి:—

(౧) ఉస్మానుషాహి, (౨) అలిజాకోట్ల, (3) వార్సింగి పరిహద్దుగ్రామము, (౪) చిచిలగూడ, (౫) అందరూన్ యాకత్పుర, (౬) తేరాబ్ యాకత్పుర, (౭) రిసాలా అబ్దుల్లా, (౮) పంజషా, (౯) గౌలిగుడ.

---

## రైళ్ల రాకపోకలు

H. E. H. ది నైజామ్సు స్టేటురైల్వే

(పెద్దలైను)

### చేరుట

| | సికింద్రాబాదు. | హైద్రాబాదు. (బి.జి.) |
|---|---|---|
| | గం.ని. | గం.ని. |
| నం, 11 ఖాజీపేట-హైద్రాబాద బి.జి. ప్యాసింజరు | 6-26 | 7-1 (బి) |
| నం, 2 వాడీ-బెజవాడ ప్యాసింజరు | 7 52 | 8-26 |
| నం, 1 బెజవాడ హైద్రాబాద ప్యాసింజరు | 15-0 | 15-41 (ఎ) |
| నం, 10 పర్లి విజయువాడ్-సికింద్రాబాద ప్యాసింజరు | 20-30 | 2 -1 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం, 9 సికింద్రాబాద-పర్లి విజయువాఢ్ ప్యాసింజరు | 7-20 | 7-56 |
| నం, 2 వాడి-బెజవాడ ప్యాసింజరు | 8-46 | 8--9 |
| నం, 12 హైద్రాబాద బి జి-ఖాజీపేట ప్యాసింజరు, | 19-45 | 19-4 (బి) |
| నం, 1 సికింద్రాబాద-వాడి ప్యాసింజరు, | 17-20 | 17-55 (బి) |

(చిన్నలైను)

### చేరుట

| | సికింద్రాబాదు, | హైద్రాబాదు (ఎ.జి) |
|---|---|---|
| | గం.ని | గం.ని. |
| నం, 31 మన్మాడ్-హైద్రాబాద యం.జి. ప్యాసింజరు | 6-50 | 7-34 |
| నం, 35 ద్రోణాచలం-సికింద్రాబాద-ప్యాసింజరు | 18-50 | 18-18 |
| నం, 33 మన్మాడ్-హైద్రాబాద ఎం.జి. ప్యాసింజరు | 20-41 | 21-10 |
| నం, 27 ద్రోణాచలం సికింద్రాబాదు ప్యాసింజరు | 6-0 | 5-25 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం, 34 హైద్రాబాద ఎం జి. మన్మాడ్ ప్యాసింజరు | 7-33 | 6-50 |
| నం, 36 సికింద్రాబాద-ద్రోణాచలం ప్యాసింజరు | 7-0 | 7-24 |
| నం, 32 హైద్రాబాద-యం.జి. మన్మాడ్ ప్యాసింజరు | 20-0 | 19-5 |
| నం, 8 సికింద్రాబాదు ద్రోణాచలం ప్యాసింజరు | 22-0 | 22-20 |

నోటు:—

(ఎ) హైద్రాబాద బి.జి. చేరిన పిదప సికింద్రాబాద వెళ్లును. తిరిగి సికింద్రాబాద నుండి 17-20 గంటలకు వాడికి బయలు దేరును.

(బి) ఈ బండ్లు ఖాజీపేటలో ఢిల్లి,మద్రాసు మధ్యనుండు పెద్ద (గ్రాండుట్రంకు) రోడ్డు మెయిలు ఎక్స్ప్రెస్సులను, వాడి బెజవాడలమధ్యగల బండ్లను కలుపును.

---


# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర ఫాల్గుణ శు॥ ౫

సోమవారము


## వాణిజ్య పరిశ్రమశాఖ నివేదిక ౧౩౪౫ ఫ.

సెరైల్ యక్సపర్టు (గుడ్డలనేత సంబంధమైన పనులలో నిప్రావీణ్యముగల అధికారి) కాశీలో సెంట్రల్ వీవింగ్ ఇన్స్టిట్యూటును చూచి వచ్చినందుకు ఫలితముగా, ఈశాఖవారు ఒక క్రొయ్య యంత్రమును కొనిరి. ఇది ఇపుడు విదేశమునుండి తెప్పించబడుచున్న ఇనుప యంత్రములతో సమానముగ పనిచేయునదియే గాక చౌకయైనది. ఇది రాష్ట్రపు నేతపారిశ్రామికులలో వ్యాపించగలదని ఆశించబడుచున్నది. ఈ వస్త్రశాఖవారు బీహారు, ఒరిస్సా ప్రభుత్వములచే నిర్వహించబడిన ప్రదర్శనములో పాల్గొని వివిధస్థానిక గృహపరిశ్రమల ఫలితములగు వస్త్రములకై 3 వెండి పతకములను ౧౧ కంచు పతకములను, ౬ ప్రశంసా పత్రములను సంపాదించిరి.

నిర్మలలో చిరకాలమునుండి మంచిస్థితిలో నుండిన ఆటవస్తువులచేయు వృత్తినుండి పలువురులేచి పోవుటచే వృత్తియే క్షీణించుస్థితికి వచ్చినది. ఆ వృత్తిని నశించకుండ కాపాడుటకై గృహపరిశ్రమశాఖవారు ఈ వృత్తులకు చెందిన కులములలోని బాలురకు జీతమిచ్చి ఆవృత్తి నేర్పించదలచిరి. తదనుసారము ఇపుడు పనితెలిసియుండు నలుగురికిని ఒక్కొక్కరికి ముగ్గురు బాలురవంతున అప్పగించబడినారు. ఈ ౧౨ మందియు పనినేర్చుకొని తయారుచేయు వస్తువులను గృహపరిశ్రమ విక్రయ సంస్థ ద్వారా విక్రయించుట కేర్పాటుచేయబడినది. పారిశ్రామికనిధినుండి నేతకు సంబంధించిన పనులను నేర్చుకొనుటకై ఒకరికిని, రంగుపనులను నేర్చుకొనుటకై ఒకరికిని, కుట్టుపని నేర్చుకొనుటకై ఇద్దరికిని విద్యార్థివేతనము లీయబడెను.

గృహపరిశ్రమ సంస్థ బరోడాలోను పాట్నాలోను ప్రదర్శనములలో పాల్గొనెను; రాష్ట్రములోనే మరిమూడు ప్రదర్శనములలో పాల్గొనెను. ఈసంస్థ యొక్క వివిధశాఖలలో ౭౮ మంది విద్యార్థులు శిక్షణము పొందిరి. సంవత్సరాంత పరీక్షలో ౨౮ మంది పాల్గొనిరి, ౧౩ మంది కృతార్థులైరి. అనిశాఖలలో తయారైన వస్తువుల విలువ మొత్తము రు. ౩౧౯౯-౮-౦-౧౧. ఇది పూర్వ సంవత్సరములో కంటె రూ. ౫౭౭౬-౫-౧౧ ఎక్కువ మొత్తము. అమ్మబడిన సరకు విలువ రూ. ౫౩౮౧-౩-౬ ఇది పూర్వ సంవత్సరములో కంటె రూ. ౨౫౩౧౮-౮-౬ లు ఎక్కువ. దీనికికారణము ప్రదర్శనములలో పాల్గొనుటయూ, ప్రభుత్వమువారి స్టేషనరీడిపోకును, సైనికశాఖకును సరకును పంపుటయు, గృహపరిశ్రమల నిర్వాహకులకు ముడిసరకులను పంపుటయు నని చెప్పబడినది.

నేతశాఖ, ఉన్నిశాఖ, నగిషీపని శాఖ, పేముపనిశాఖ, ఆటవస్తువులశాఖలలో నివేదికసంవత్సరములందు తయారుచేయించబడిన మొత్తము సరకునిలువకంటె అమ్మబడిన సరకు విలువ తక్కువగా నున్నది. కుట్టుపనిశాఖలోను, తివాసీశాఖలోను అమ్మబడిన సరకువిలువయే తయారు చేయబడిన సరకు విలువకంటె హెచ్చుగానున్నది. కానిం౧౩౪౫ఫ. లో మిగిలిన సరకు విలువనుకూడ కలుపుకొనినచో నివేదిక సంవత్సరాంతమునకు ప్రతిశాఖలో నిలువసరకు ఉండనే ఉన్నది. విద్యాశాఖవారిచే నిర్వహించబడుచున్న పారిశ్రామిక పాఠశాలలన్నియు, నేత, రంగు, అద్దకములకు సంబంధించిన హైదరాబాదు, సికింద్రాబాదులలోని కార్ఖానాలన్నియు పరిశ్రమశాఖవారి జనరల్ స్టోర్సును ఉపయోగించుకొనినవి.

ఈశాఖవారి గ్రంథాలయములో పరిశ్రమలకు సంబంధించిన ౧౨౫ గ్రంథములుండెను. నివేదిక సంవత్సరములో ౧౩ క్రొత్తగా చేర్చబడెను. ౭ పరిశ్రమల సంబంధములగు పత్రికలు తెప్పించబడుచుండెను.

నాంబాశాఖలో ముగ్గురు శిక్షణము పొందుచుండిరి. ఈశాఖలో రూ. ౩౩౩-౫-౦ ల విలువగల సరకు ఉత్పత్తిచేయబడెను. పూర్వసంవత్సరపు నిలువ సరకుతో కలుపుకొని రూ. ౩౮౬-౭-౮ ల విలువగల సరకు అమ్మబడెను.

పట్టునేతశాఖలో ఫ్రాన్సు దేశమునుండి తెప్పించిన ఒక యంత్రముతో పని సంతృప్తికరముగా జరిగినది. ఈ శాఖను గృహపరిశ్రమ సంస్థతో చేర్చదలచి యున్నారు.

ప్రదర్శనశాల (షోరూం) లో ౧౩౪౫ఫలో రూ. ౭౭౩౩-౦-౧౧ ల విలువగల సరకు అమ్మబడియుండ నివేదనసంవత్సరములో ౨౪౨౬౧-౮-౦ విలువగల సరకు అమ్మబడెను. గృహపరిశ్రమ సంస్థయొక్క విక్రయశాలలో విక్రయము వలన ౧౩౪౫ఫలో కంటె రూ. ౭౩౯౨ లు అదనముగ వచ్చెను. నివేదన సంవత్సరమందు మొత్తము మీద రు. ౩౨౮౫౦-౬-౭ ల విలువగల సరకు అమ్మబడెను.

నేత, రంగువేయు పనులకు సంబంధించిన ప్రచారమును జిల్లాలలో చేయుటకు నియోగించబడిన ఉద్యోగులశాఖయంతటికిని మొత్తము మీద రూ. ౬౫౮-౪-౧౧ ల విలువగల నేత సంబంధములైన వస్తువులు కొనబడెను. రూ. ౫౩౧౨-౬ ల విలువగల సరకు జిల్లాలలో వాయిదాల పద్ధతిపై అమ్మబడెను. రూ. ౮౬౫౬ ల విలువగల నూలు కొని ఇదివరకేయుండిన రూ. ౫౯౧ ౧౩-౩ ల విలువగల నూలుకు చేర్చబడెను. ౨౦౮౫ మంది నేతపనివాండ్రకు శిక్షణ మొసగబడెను. ఇంతేగాక జిల్లాప్రదర్శకుల జట్లు అనేకగ్రామములందు గ్రామోద్ధరణ కార్యములందును, యాత్రలలోను పాల్గొనెను. షెరేలో నేత ప్రదర్శన సంస్థయందు ఆరుగురికిశిక్షణమొసగబడెను. వారలకు చిత్రవిచిత్రములైన నేతపనులు నేర్పించబడెను. కొందరు ఈ సంస్థనుండి శిక్షణ పొందిన విద్యార్థులు ఒక్కొక్కటి రూ. ౧౦ ల విలువగల ౧౦ వాటాలతో నొక గుడ్డల కార్ఖానా పెట్టించి నడపుచున్నారు.

ప్రభుత్వమువారి తివాసీ కార్ఖానాలో ౪౦ మందికి శిక్షణమొసగబడెను. ఈకార్ఖానా ఢిల్లీలో రాజమందిరముకు రూ. ౧౧౧౬౩-౦-౩ ల విలువగల సరకును పంపెను; ౧౩౪౫ ఫ. లో రూ. ౫౯౧౧-౦-౭ ల సరకును మాత్రమే పంపియుండెను. కాని రగ్గుల అమ్మకము తగ్గెను.

## డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారి ప్రతిభ

రాజా బహద్దర్ వెంకటరామారెడ్డిగారి ఉపన్యాసము

హైదరాబాదు మార్చి ౨

నేటిసాయంకాలము రెడ్డివిద్యార్థివసతిగృహముందు నగరమందలి వివిధఆంధ్రసంస్థలపక్షమున డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారిని సన్మానించిన సందర్భములో సభ కధ్యక్షతవహించిన రాజాబహద్దర్ వెంకటరామారెడ్డిగారు రామలింగారెడ్డిగారి ప్రతిభనుగూర్చి ఇట్లుపన్యసించిరి:—

"డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఇండియాదేశమందు చాలా ప్రసిద్ధి పొందినవారు. మన ఆంధ్రులలో ఇంతగొప్పవారు చాల అరుదుగా కనబడుతారు, వీరిచరిత్ర అందరికినీ తెలిసినదే, అయినను నేను వీరినిగురించి రెండు మాటలు చెప్పుతాను. వీరు ఇంగ్లీషుభాషలోనే కాక తెలుగులోను సంస్కృతంలోను చాలా గొప్పపండితులు. వీరు అనేక గ్రంథాలు రచించినారు. తెలుగులో మంచికవిత్వం కూడా చెప్పినారు వీరు చిన్నదినమునుండి మనదేశంలో విద్యకై పరిశ్రమచేసినారు. మొదలు బరోడా సంస్థానములో గొప్పఉద్యోగం చేసినారు. తర్వాత మైసూరుసంస్థానంలో చాలాఏండ్లు విద్యాశాఖకు అధికారిగానుండి మైసూరు యూనివర్సిటీకి కారకులైనారు తర్వాత ఆంధ్రయూనివర్సిటీఏర్పడినప్పటినుండివీరురెండుమారులుగా వైస్ ఛాన్సలర్ పదవిపైనుండి గొప్పసేవ చేయుచున్నారు. వీరు తమ జీతములో సగముజీతము ఆంధ్రా యూనివర్సిటీకి ఇచ్చివేసి గొప్పత్యాగం చేసినారు వీరి హృదయం చాలామంచిది, దయగలవారు, మంచిస్నేహితులు, ఆంధ్రులపై ఆంధ్రభాషపై చాలా అభిమానంకలవారు. రెడ్డికులస్థులమైన మాకు మాకులంలో ఇంతగొప్పవారుండడం మాకందరికీ చాలా గర్వంగానున్నది వీరిని ఈ దినం హైద్రాబాదులోని సంఘములు గౌరవించినందుకు విచిత్రమేమిన్నిలేదు. ఇంకా అవకాశం దొరకలేదుగాని లేకుంటే ఇంతకన్న మించినసభలుచేసి వీరిని గౌరవించేవారు చాలామందికి ఈ నాటి సభనుగురించి తెలుసుకొనుటకు అవకాశం దొరకలేదు. సరియు ఈదినము నాడే ఇదేకాలములో హైద్రాబాదు పట్నంలో ౧౦ తావులలో మద్యపాన నిరోధకసభలు జరుగుచున్నవి. అట్లువిధము జనులు పోలులోపట్టకుండా నిండిపోవడం చూస్తే శ్రీ రెడ్డిగారిపై ఈనగరంలోని ఆంధ్రులకు ఏ తగౌరవం ఎంతప్రేమ ఎంతభక్తి కలదో వెల్లడిఔతున్నది.

శ్రీరెడ్డికి దేవుడు ఇంకాఎక్కువ ఐశ్వర్యము, ఇంకా ఎక్కువ సేవాశక్తి దీర్ఘాయుష్యంఇచ్చి సుఖంగా కాపాడవలె అని మా అందరి ప్రార్థన.

"హైద్రాబాదులో మేమున్న మాశక్తికి తగినట్లుగా మా ప్రభుత్వంవారికి తోడ్పడుతున్నాము. మేము విద్యావ్యాప్తికి గాను నగరలో ఒక బాలికల ఉన్నత పాఠశాలను, ౪—౫ తెలుగు సంఘాల యొక్క ఈరెడ్డి హాస్టల్, ఒక రెడ్డిబాలికల హాస్టల్, రెండుమూడు బాలికల ప్రైమరీ పాఠశాలలు నడిపించుతూ వున్నాము.

డాక్టరు రామలింగారెడ్డిగారిని ఎప్పటికిని దృష్టిలోవుంచుకొని మా ఆంధ్రులందరూ వృద్ధిలోకి వచ్చెవలెనని కోరుతూవున్నాము.

"ఇగల డాక్టరు రామలింగారెడ్డిగారి అమూల్యారోగ్యాల అభివృద్ధికై దేవుని ప్రార్థించుచున్నాము."

---

నివేదిక అంతమున నివేదికసంవత్సరమందు రాష్ట్రములో వివిధపరిశ్రమల అభివృద్ధి ఎట్లుండెనో తెలుపుటకు ప్రతి పరిశ్రమయందును ఉత్పత్తి పరిమాణమును సూచించుచు అంకెలొసగబడినవి. సిమెంటు, ఆముదము, వేరుసెనగ నూనె, ఇతరములైన నూనెలు, లోహపుపనులు, అగ్గిపుల్లలు, రంగులు, వార్నీషులు, గుండీలు, గాజు, బిస్కత్తులు, కొవ్వు—వీటి పరిశ్రమ లన్నియు నివేదన వత్సరమందు మంచిస్థితిలోనుండెను. గమనించదగిన విశేషములేవన, ప్రతి వత్తులతీయు పరిశ్రమలో యంత్రములు హెచ్చుటచే నష్టపడుచున్నామని ఆపరిశ్రమలోని వారలు ఘోషించగా పరిశ్రమశాఖవారు విచారణ చేయుటకు నిశ్చయించి, ఈలోగా క్రొత్తయంత్రములను పెట్టుకొనువారలకు అనుమతి నీయరాదని నిశ్చయించిరి. ప్రభుత్వమునుండి అమ్మివేయబడిన సబ్బుకార్ఖానా మూతపడెను. కాగితపు చేతిపరిశ్రమ మంచి అభివృద్ధిలోనుండెను. కాగితము తయారుచేయుట లేక పెద్దమిల్లును స్థాపించు విషయమును గూర్చి ప్రభుత్వము వారాలోచించు చుండిరి.



## దౌర్జన్యమును సాగనీయము

సరిహద్దు రాష్ట్ర ప్రధాని ప్రతిజ్ఞ

సిక్కుల హత్యసందర్భమున ఇండ్ల సోదాల విషయములో అడ్జర్నమెంటు ప్రతిపాదన ఓడుట

పెషావరు: మార్చి ౪.

సరిహద్దు అసెంబ్లీలో నేడు పోలీసులారు ఇండ్ల సోదాలు చేయుటనుగురించి మహమ్మదు జౌరంగజేబుఖాన్ ఉపపాదించిన అడ్జర్నమెంటు తీర్మానము ఓడిపోయినది. పెషావరు నగరమున ఇటీవల సిక్కులహత్యలు జరిగినపుడు గౌరవనీయులగు చాలమంది మహమ్మదీయులఇండ్లను పోలీసులు సోదాచేసిరని, అందుకు అసమ్మతితెలుపుటకు ఈతీర్మానముద్దేశింపబడినది. కాంగ్రెసేతర మహమ్మదీయ సభ్యులందరు తీర్మానమునకు అనుకూలముగ వోటుచేసిరి. హిందూ సిక్కుపార్టీవారు వ్యతిరేకముగ వోటుచేసిరి. అనుకూలముగ ౧౫వోట్లు, ప్రతికూలముగ ౨౬వోట్లు వచ్చుటచే తీర్మానము ఓడిపోయినది.

ప్రధానమంత్రి డా. ఖాన్ సాహేబు గారు అడ్జర్నమెంటు తీర్మానము నెదిరించుచు ప్రజలలో చాలకుండి పెషావరులో దౌర్జన్యము కల్పించుచున్నారు. కాని ప్రభుత్వము వారీ యుపద్రవమును నాము రూపములు లేకుండజేయుటకు నిశ్చయించిరని ఆయన ప్రకటించెను.

## ముఖ్యవిషయ చర్చలో మంత్రులందరుండవలెను

బొంబాయి మార్చి౪:

ముఖ్యమైన విషయములపై సభలో చర్చ జరుగునపుడు మంత్రులు గైరుహాజరగుటను గురించి బొంబాయి అసెంబ్లీలో స్పీకరుమవలంకార్ గారు ఒక ప్రకటన చేసిరి.

బొంబాయి అసెంబ్లీలో నేడు అనధికార కార్యక్రమము జరుగవలసిన రోజు. కార్మిక నాయకుడు జబవాలాగారు ప్రవేశపెట్టిన అరబిల్లులపై చర్చజరుగుటతోనే ఈదినమంతయు గడచినది. ఈయన ఒక్కొక్క బిల్లును చర్చకు తీసుకొనవలెనని యుపపాదించగా, ప్రభుత్వ ప్రతికూలముకలన అన్నియు వీగిపోయినవి. మధ్యాహ్న భోజనముతర్వాత ఒక ప్రతిపాదనపై చర్చజరుగుచుండగా సభలో మంత్రి లెవరుగూడ లేరు.

ముఖ్య విషయములపై చర్చ జరుగునప్పుడు మంత్రులు—ముఖ్యముగా సంబంధించిన మంత్రి కూడ హాజరు లేకపోవుటనుగురించి ప్రతిపక్ష నాయకుడు ఆక్షేపణ గావించెను.

ఈసందర్భమున స్పీకరు మవలంకర్ గారు ఒకప్రకటనచేసిరి. ఇదివరలో, సంబంధించిన మంత్రి గైరుహాజరైనను ప్రభుత్వపక్షమున పార్లమెంటరీ సెక్రెటరీ మాట్లాడవచ్చుననని వీల్పాటున్నది. "అయినప్పటికిని ముఖ్యముగు చర్చ జరుగుచున్నప్పుడు మంత్రులందరును, అన్ని పార్టీల నాయకులనుగూడ సభలో నుండవలెనని సంప్రదాయ మేర్పాటుచేయుట చాలమంచిది" అనిరి.

రాజాబహద్దుర వేంకటరామారెడ్డి ఒ. బి. ఇ. గారు

## ఖైదీల విడుదలకై కలకత్తాలో మేయరుఅధ్యక్షతన సభ

కలకత్తా మార్చి ౪.

వెంటనే ఎట్టిషరతులులేకుండ అందరు రాజకీయఖైదీలను, డిటెన్యూలను విడుదల చేయగోరుటకు ఈ సాయంకాలము అల్బర్టు హాలులో కలకత్తా కార్పొరేషన్ మేయరు అధ్యక్షతక్రింద గొప్ప బహిరంగసభ జరిగినది. ఇంకను రాజకీయఖైదీలను డిటెన్యూలను విడుదలచేయకున్న బెంగాలు ప్రభుత్వముయొక్క అసహ్యకరమగు వైఖరిని సభవారు ఖండించిరి. అభ్యర్థనలను ఉపేక్షించుటవలన అమితమైన ఆందోళనకు అవకాశమేర్పడగలదని వెల్లడించుచు సభవారు తీర్మానముచేసిరి.

## మైసూరు కాంగ్రెసు నాయకుని హక్కుపోవుట

జైలుశిక్ష ననుభవించుటచే పురపాలక సంఘ సభ్యత్వము పోవుట

బెంగుళూరు: మార్చి ౩.

రాజద్రోహకరమగు ఉపన్యాసమునిచ్చినందులకు ౧౮ నెలలు శిక్షపొందియున్న కాంగ్రెసు నాయకుడు కె. టి. భాష్యంగారు, పురపాలకసంఘ సభ్యత్వమును కోలుపోయిరి. ప్రభుత్వము అనుమతించినగాని సభ్యత్వ మభ్యర్థికి కూడ నిలుచుటకు వీలు లేదు.

# హైదరాబాదు గృహపరిశ్రమసంస్థ జెనానా విక్రయశాఖ

## యువరాణిగారు ప్రారంభోత్సవము జరుపుట

హైదరాబాదు మార్చి౫

నేటి ఉదయము గృహపరిశ్రమసంస్థ (కాటేజి ఇండస్ట్రీస్ డిపో)వద్ద, ఇప్పుడీసంస్థయుండు భవనముయొక్క పైభాగమున జెనానా విక్రయమందిరముయొక్క ప్రారంభోత్సవము ను చూచుటకై సికింద్రాబాదునుండియు హైదరాబాదునుండియు గొప్పగొప్పవారి ఇండ్లనుండు స్త్రీలు పలువురు వచ్చియుండిరి!

భువనశోభితమైన బరాయుయువరాణి ప్రారంభోత్సవము జరుపుటకు వచ్చియుండెను.

ఆమె తెల్లని మజ్లిన్ పైరా-చీరను ధరించియుండెను. దానికి రంగుఅంచు ఉండెను. అది నిరాడంబరముగ నుండినను చూచుటకు రమణీయముగనుండెను. అట్టిచీరధరించి యువరాణిగారు రాగానే టాస్కర్ సతిగారును, మహిళాసంఘమండలి ఇతర స్త్రీలును స్వాగతమొసగిరి. వారందరు పైన డాబామీదకిపోయిరి, అక్కడ అదివరకే జనము నిండియుండెను. హిలాఫర్ రాజమాత, బేగం మెహిదియార్ జంగ్, రాణీ అంబాబాయి రాజవంశ్యా, వనపర్తి మహారాణి, మహారాజా కిషన్ ప్రసాద్ గారి కుమార్తె సభలోనుండిరి.

పులుకూడ ఉండుండెను. మనోహరము లైనఅట వస్తువులుండెను, బొమ్మలపక్షులు నిజమైన పక్షులవలె నుండెను వరంగల్లు జైలునుండి, ఇతరపలములనుండియు తెప్పించబడిన తివాసీలను క్రిందపరచినవాటినిమీద యువరాణిగారు సంతోషించిరి.

హైదరాబాదులో అద్దకము చేయబడిన అనేకములైన గుడ్డల పట్టుగుడ్డలను యువరాణిగారు కొని క్రిందికి దిగునపుడు మెట్లమీద పరచియుండు తివాసీపరకను, గోడలకు పరచియుండిన తెరగుడ్డలను యువరాణిగారుచూచి మెచ్చుకొనిరి, మరియు బ్రోకేలో నిర్మలలో చేయబడిన అక్కడవస్తువులు ఆమె సాకర్షించెను. కొనదలచిన ఆమె తెరకొనవలసిన సామగ్రిని ఏర్పరచుకొనుచు కొలముగడిపెను.

యువరాణిగారు క్రిడి విక్రయశాలనుచూచి పేకుతో చేయబడి, లోపలలోనాము అతికించబడియుండిన సామ్ములపెట్టె కొనిరి.

ఇట్లు పరిశీలన పూర్తియైనతర్వాత యువరాణిగారికి పూలమాలవేసిరి. యువరాణిగారంత ప్రేక్షకుల పుస్తకములో సంతకము చేసి రెండు మాటలు అభినందించి ఇట్లుపూగించిరి.

టాస్కర్ సతి వినతిపత్రము చదివెను. రహంతుల్లాసతి అభినతిపత్రము అచ్చువేయబడియుండిన ఒక సంగారెడ్డి పట్టుగుడ్డ అమర్చియుండిన బీదర్-పన్నుల ఫిట్టింగు నోటిసుండి త్రేలాడుచుండిన ఒక అందమైన లోహపు పులిని యువరాణిగారికి సమర్పించెను. ఈపని యంతయు నిర్మలలో ఆటవస్తువులు తయారు చేయువారిచే చేయబడినది. అంతట యువరాణిగారు ప్రారంభోత్సవము జరుపవలసిన రెండుగడులకు పైనుండి త్రేలాడగట్టబడిన తెరను, దానికి కట్టబడియుండిన అకుపచ్చ పట్టుత్రాడు లాగి తొలగించి, ప్రారంభోత్సవము జరిపిరి.

యువరాణిగారంత హిలాఫర్ రాజమాతతోను, ఇతరులతోను, మహిళాసంఘ సభ్యురాండ్రతోనుకూడి క్రొత్తవిక్రయశాలలో అమర్చబడియుండిన వస్తువుల నన్నిటిని చూచుచు కొంతకాలము గడిపిరి. యువరాణిగారు నాణ్యమైన ఒక అల్లికపై చేయబడిన నగిషీపనిని చూచి చాల ఆశ్చర్యపడిరి. వారు తమఅభిప్రాయముచెప్పి, ముందు అభివృద్ధికై చేయవలసిన సూచనలను కొన్నిటిని చేసిరి. ఆసూచనలు మంచివిగ నుండుటచే మహిళాసంఘమువారు వాటిని ఆచరణలో పెట్టుటకు సంఘమువారు నిశ్చయించిరి.

జెనానా విక్రయమందిరపు గదులు మనోహరముగ అలంకరించబడియుండెను. అందుహైదరాబాదులో చేయబడిన అనేకవస్తువులుండెను. ఉజ్వలమైన పట్టుగుడ్డ ప్రదర్శనమునకై గోడలకు కట్టబడియుండెను, గదియొక్క మధ్యభాగమందు అనేకరకములైన అంచులు ప్రదర్శించబడెను, నేతగుడ్డలు, తెరలు, పరికరాలపై పరచుకొను గుడ్డలు మున్నగునవి అనేకరకములు ప్రదర్శించ బడును. మెదకు నుండి వచ్చిన అద్దకపు నరకుకూడ చాలఉండెను. ప్రాచీనమునుండి ప్రసిద్ధమైన నైరాపనులు కొన్ని చాల రమణీయమైనవి ఉండెను, వెండిపనిగల లోహపువస్తువు, వస్తువుల పళ్లెములు మున్నగునవి అనేకములు అందమైన బీదరుపనిపరకు కూడ ఉండెను. హైదరాబాదులో చేయబడిన గుండీలు, పూసలు, ఇంకను అనేకవస్తువు[illegible]

"నేను మనస్సులోనమ్మి యూరకుండలేను నాకు సాధ్యమైనపుడెల్ల ఈ విక్రయశాలకువచ్చి చూచి, వస్తువులనుకొని నాకు ఈఉద్యమమునందు గల అభిమానమును నిదర్శనముగ వెల్లడించగలను మీరందరుకూడ ఇట్లనే చేయగలరని ఆశించుచున్నారు."

వచ్చిన అతిథులకు సలహోఎమునకు సహాయముగవచ్చిన రుస్తుంజంగ్సతి నార్మమువాకర్ సతి మున్నగు మహిళామణులు అల్పాహారములను ఏర్పాటుచేసిరి.

వచ్చియున్న స్త్రీలు పలువురు మధ్యాహ్నము ఒంటిగంటవరకుకూడ చూచుచుండి అనేకవస్తువులను కొనిరి.

గృహపరిశ్రమ సంస్థవారు సలహాసంఘము లో నుండుటకై ఈక్రింది మహిళామణులు నాహ్వానించియుండిరి:—

అధ్యక్షురాలు టాస్కర్ సతి; సభ్యురాండ్రు బేగం మెహిదినవాజ్ జంగ్, బ్లేర్ గారిసతి, రహింతుల్లా గారిసతి, హుమాయూన్ మిర్జా గారి సతి, రాణి త్రియంబక్ రాజ్, ఎక్బాల్ హైదరిసతి, మిస్. రోషన్ రుస్తుంజీ.

### అనేక సంఘములపై నిషేధము తొలగించుట

బెంగాలు ప్రభుత్వమువారి ఆజ్ఞ

కలకత్తా మార్చి ౧

పూర్వము శాసనోల్లంఘనోద్యమ కాలములో నిషిద్ధములని ప్రకటించ బడిన ౧౬౬ సంఘములపై నిషేధమును బెంగాలు ప్రభుత్వమువారు ఇప్పుడు తొలగించినారు. మిగిలిన ౪౨ సంఘములపై నిషేధములను తొలగించుటను గూర్చి ఆలోచించుచున్నారు.

### నవ్య సాహిత్య పరిషత్తు

హైదరాబాదు శాఖ ఏర్పాటు

హైదరాబాదు (దక్కన్)మార్చి౪

నిన్నరాత్రి ౯|| గం.కు శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయములో కొందరు ప్రముఖులు హైదరాబాదునందు నవ్యసాహిత్య పరిషత్తుశాఖ నేర్పరచు విషయమై ఆలోచించి మొదటదానికి అవసరమగు ప్రయత్నము చేయుటకు ఈక్రింది సభ్యులుగల తాత్కాలిక సంఘము నేర్పరచుటకు నిశ్చయించిరి:—

(౧) సురవరం ప్రతాపరెడ్డిగారు
(౨) యల్లాప్రగడ సీతాకుమారిగారు
(౩) కపిల కాశీపతిగారు
(౪) భాస్కరభట్ల కృష్ణారావుగారు
(౫) కొమాండూరి వెంకటాచారిగారు

కడపటి ఇరువురికిని సమావేశ నధికారమియ్యబడినది.

### రిజిస్ట్రేషను అధికారము మార్పు

హైదరాబాదు మార్చి ౪

ఆదాయశాఖ సూచనపై ప్రభుత్వమువారు రిజిస్ట్రేషను అధికారములను బాగాతి తవాసీలనుండి హైదరాబాదు నగరపు రిజిస్ట్రారుగారి కార్యాలయములకు (నగరపు బ్రాంచి ఆఫీసు, మరియు సుల్తానుబజారు ఆఫీసు)మార్పుటకు ఆమోదించినారు.

### రష్యాలో మరి ఏడుగురిపై దేశద్రోహ నేరము

మాస్కో మార్చి ౩

దేశద్రోహ నేరముపై ౨౧మంది ప్రసిద్ధ రష్యానాయకులు ఇప్పుడు విచారణ పొందుచున్నారు వీరేకాక మరి ఏడుగురుకూడ అరెస్టు చేయబడిరని ఇప్పుడు తెలిసినది.

వీరిని వేరుగ విచారణచేసెదరట. ఈ ఏడుగురు కౌన్సల్ల క్రిందటివరకు ప్రసిద్ధ సోవియటు నాయకులుగ ఎన్నబడిరి. వీరిటీవల కనబడకుండపోయిరి. కాని పోలీసులు అరెస్టు చేసిరి.

ఇప్పుడు విచారణ పొందుచున్న ౨౧ మందిలో ఒకడయిన గ్రినోక్, ఈ ఏడుమందికూడ తమ కుట్రలో చేరినవారే అని తెలిపెను. అర్థిక కమిసార్ (మంత్రి)అయిన యూకానివా అను స్త్రీకూడ ఈఏడుగురిలో ఒకతె.

### పశ్చిమ ఆఫ్రికాలో ఫ్రెంచి జలాంతర్గాములకు రేవు

డువాలా(పశ్చిమ ఆఫ్రికా) మార్చి ౩

ఫ్రెంచివారిచట జలాంతర్గామి నావాశ్రయము నొకదానిని స్థాపించిరి రెండు ఫ్రెంచి జలాంతర్గాములు ఇచటికి వచ్చినవి. క్రొత్త జలాంతర్గామి ఆశ్రయములోనికి వచ్చుటకిదియే మొదటిది.





### గృహ నిర్మాణముల నిబంధనలు

పురపాలక సంఘమునకును, నగరాభివృద్ధి శాఖకును అధికారములు

హైదరాబాదు మార్చి ౪

ప్రభుత్వ ప్రకటనశాఖచే ఈక్రింది నోటిఫికేషను ప్రకటించబడుచున్నది:—

హైదరాబాదు నగరమందును,దాని చుట్టుముట్టు ప్రదేశములందును ఇండ్లను కట్టుకొనుటకు సంబంధించిన వ్యవస్థను నియమబద్ధముగ ఆరికించుటకును, అవి సరియైన పద్ధతులపై నగరాభివృద్ధిగాంచునట్లు చేయుటకును, విషయములను అనుకూలపరచుట అవసరమైనది గనుక, ౧౩౪౭ నవంబరు ౪వ తేదివాటి ను.ఘు.వ.ప్రభువుగారి ఫర్మానుచే దయతో ఆమోదించబడిన ఈక్రింది నిబంధనలు ప్రజలకు తెలియుటకై ప్రకటించబడుచున్నవి.

నగరములోను, నగరము వెలుపలను అట్టి వ్యవస్థలను నియమబద్ధములుగ నుండునట్లు చేయుటకు క్రమముగా పురపాలక సంఘమునకును, నగరాభివృద్ధి శాఖకును అధికారము ఈయబడినది. ఈ రెండుసంస్థలును ఈక్రింది నియమముల ననుసరించి పనిజరిపించును.

౧. నగరాభివృద్ధిశాఖయొక్క సూపరింటెండింగు యింజనీయరుయొక్క కార్యాలయమందు నగరముయొక్క హద్దులనుండి చుట్టును రెండు మైళ్లవరకు పరిసర ప్రదేశముల హద్దులను చూపించు పటమొకటి యుంచబడును.

౨. (అ) ఈ ప్రకటించబడిన ప్రదేశములో ఎవడుగాని, ఈ సందర్భమున అధికారముగల అధికారినుండి వ్రాతమూలముగ అనుమతిపొందక ఎట్టిభూమి వ్యవస్థగాని చేయరాదు

(ఆ) చేయదలచిన నిర్మాణముయొక్క మాదిరి వొకదానిని తత్సంబంధమైన అధికారికీయవలెను. అయధికారి అచోట సాధారణముగా నిర్మాణముల రమ్యతకుతగని వికారములైన నిర్మాణముల చేయరాదని అపుటకు అవకాశమున్నదాయను దృష్టితో అమాదిరి ప్లానును పరీక్షించును,

౩. అయధికారి అనుమతి యొసగబడదని ఇంటినికట్టరాదని వ్రాతమూలముగ తెలుపుటకు అధికారము గలిగియుండును. అయధికా

అట్టియాజ్ఞ యొసగినచో అట్టి నిర్మాణములను కూలగొట్టవలసి యుండును.

౪. ౩వ నియమముక్రింద అధికారి గైకొనిన చర్యచే నష్టమేదైన కలిగినచో, నష్ట పరిహారము ను పొందుటకు ఎవనికిని హక్కులేదు.

౫. ఏ ప్రదేశమందుగాని నిర్మాణము యజమానికి చెడుగులని అధికారి తలచుచో, అతడు ఆ నిర్మాణము చేయదగనిదని తెలియజేయును. అట్టి నిషేధాజ్ఞచే కలిగిన నష్టమునకు పరిహారము కోరుటకు ఎవరికిని హక్కుండజాలదు.

౬. నిర్మాణములు చేయబడుచున్న భూముల సందర్భములో లేక అభూములు నిర్మాణప్రపనులకై ఉపయోగించుకొన ఒడబడ్పునిపించునపుడు, నగరవ్యవస్థకై ఒక ప్రణాళికను చేయవచ్చును. అట్టి ప్రణాళికలో మొదట నిర్ణయించబడిన భూమిలో ప్రతిశతి ౨౦ లెక్కన, తలపెట్టబడిన వ్యవస్థకు—విశాలమైన భూములు, ఆటస్థలములు, తోటలు, రోడ్లు, మార్కెట్లు, వీటి నిర్మాణమునకు—అవసరమని తలచునంతమట్టుకు భూమిని చేర్చవలెను.

౭. అట్టి ప్రణాళికలకగు ఖర్చులు ఆప్రణాళిక క్రింద అధికారి, భూమి విలువలో తలపెట్టబడిన అభివృద్ధిచే కలిగిన హెచ్చుదలను దృష్టిలోనుంచుకొని, అభూమి యజమానినుండి పొందు మొత్తమునుండి భరించబడవలెను.

౮. మార్చబడిన ప్రదేశములను వాటిపూర్వ యజమానుల కిచ్చునపుడు అధికారి వాటిహద్దులను మార్చుటకు అధికారము గలిగియుండును. అతడు ఏప్రదేశమునుగాని ఒక యజమానినుండితీసి ఇంకొక యజమానికీయవచ్చును.

౯. ప్రణాళిక ఆమోదించబడిన తర్వాత,దానినిగురించి అధికారి ఈ వివరములను ప్రకటించును.

(అ) పూర్వము ఉన్నప్రదేశముల విస్తీర్ణము

(ఆ) పూర్వమున్న ప్రదేశములకు బదులుగా ఈయదలచినుండు వేర్వేరుప్రదేశముల విస్తీర్ణము,

(౩) ఆ ప్రణాళికకగు మొత్తము ఖర్చులు, మరియు ప్రతి ప్రదేశముయొక్క యజమానికిని తగులు ఖర్చులును.

